శ్రీ

# రమణీయ రామాయణము.

ఆదిపూడి, సోమనాథరావు ప్రకటితము.



మొదటి కూర్పు 600 ప్రతులు.

లక్ష్మీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గద్వాల.

1930

# విన్నపము.



ఏమహానుభావుల చరిత్రను మనమనుసరించినయెడలఁ బాపసముద్రము నుండి తరింపఁగలమో యట్టివారికి నవతారపురుషులని పేరు. హిందువులకు శ్రీరామచంద్రుఁడు అవతారపురుషులలో ముఖ్యుఁడు. శ్రీరాముఁడు మన జాతిజీవితమునందంతటను దాండవమాడుచున్నాఁడు. సుఖములో శ్రీరాముఁడు దుఃఖములో శ్రీరాముఁడు ఆటలలో శ్రీరాముఁడు పాటలలో శ్రీరాముఁడు స్త్రీలలో శ్రీరాముఁడు పురుషులలో శ్రీరాముఁడు తెందావాటలలో శ్రీరాముఁడు త్యాగరాజకృతులలో శ్రీరాముఁడు. ఇంతటిసర్వమైననామము ఇంతవ్యాప్తమైననామము ఇంతమాధుర్యమైననామము మఱియొకటిలేదు. శ్రీరామచరిత్రమునైన నెంతవైనను వర్ణింపకుండు కవియే మనలో లేఁడు. ఇంతమనోహరమైన చరిత్రలోఁ గొన్ని యసంభవములును గొన్ని కల్పితములు నుండుట గొప్పలోపమని తలంచి నాకు నసంభవములనియుఁ గల్పితములనియుఁ దోఁచినవానిని సవరించి యుండుటకుఁ బూర్ణాపర్కకముగ నుండవలయునను సదుద్దేశముతో శ్రీరామచరిత్రను హరికథారూపముగవ్రాసి కోరినవారికెల్ల మనఃపూర్వకముగ వినిపించుచుంటిని. ఈనాప్రదర్శనమును జూచువారికి నెంతో మనోహరముగానుండినను, నా శరీరమునకు నుబుద్ధికిని పరిమితమైన కష్టము కలుగుచుండెను. ప్రస్తుతపు నా శరీరదౌర్బల్యమును గురుతించిన నా మిత్రులలోఁ బలువురు దీనిని గ్రంథరూపముగ సచిత్రింపవలయునని కోరుచువచ్చిరి. నాయార్థికస్థితి పనికిఁబ్రతికూలముగా నుండెను. ఇట్టిస్థితిలో నేను హైదరాబాదునకు వచ్చుటతటస్థిం

చెను. అప్పుడు నామిత్రులగు శ్రీ యస్, శ్యామరావుగారిమూ
లమున నేను దోమకొండ సంస్థానాధీశులగు శ్రీరాజా
సోమేశ్వరరావుబహద్దర్ గారిని దర్శించి నా యీర
మణీయరామాయణమును గొంతచదివి వినిపించి దీనిని శ్రీవా
రికి సంకితమీయఁదలంచితినని ప్రస్తావించితిని. శ్రీవారు సంత
సించి సమ్మతించి నన్నుఁదగినట్లుసత్కరించి తామీగ్రంథమును
గద్వాలలో ముద్రించి 400 ప్రతులు నాకుదయచేయించునట్లు
ను రెండవ కూర్పునుండి దీనిముద్రణాధికారము నాకేయుండున
నియు సెలవిచ్చి నన్నెంతయో యాదరించిరి. నాగ్రంథము వె
లుతురుచూడఁగలిగెనుగదాయని యెంతయో సంతసించి శ్రీ
రాజా గారికి నాకృతజ్ఞతాపూర్వక వందనముల సమర్పించితిని.

శ్రీ రాజా గారికిని వారికుటుంబమునకును బరమేశ్వ
రుఁడు సమస్తశుభములను బ్రసాదించునుగాక. ఆంధ్రులందఱు
దీనిని దగినట్లాదరింతురుగాత.

ఆసప్రాజీ, సోమశేఖరరావు.

15—3—1930



# అంకితము.

సీ॥ శ్రీజేండ్లకులమను ♦ క్షీరవారాశిలో
జన్మించి వర్ధిల్లు ♦ చంద్రునీకు
దోమకొండకు మహా ♦ సీమ గద్వాలకు
నూఁతగానొప్పెడు ♦ నేతనీకు
విద్వాంసులనుమతి ♦ విమలవర్తనులను
మన్నించుచుండెడు ♦ మాన్యనీకు
వివిధభాషలయందు ♦ విజ్ఞానమునుగల్గి
తనరారుచుండెడు ♦ ధన్యనీకు

గీ॥ నవ్యరమణీయ-రామాయ ♦ ణమ్ముదీని
నంకితంబిత్తుఁ గొనుము వి ♦ ఖ్యాతిఁగనుము
శుద్ధచారిత్ర! సత్కవి ♦ స్తోత్రపాత్ర!
ఆప్తసురభూజ! సోమేశ్వ ♦ రాఖ్యరాజ!



శ్రీ

# రమణీయ రామాయణము.

---

శా॥ శ్రీరమ్యామల శిష్టపాలనకళా ♦ శీలా! కృపాసాగరా!
శ్రావ్యంబౌ సమస్తమండలవిభా ♦ ధారా! త్రిలోకేశ్వరా!
శ్రీరామాధిపువంటి నీతిచతురుల్ ♦ శ్రీకీర్తి విద్యాధరుల్
ధీరుల్ శాస్త్రవిహారులేయుము సదా ♦ సోమేశ్వరుల్ భూవరుల్.

కం॥ నవరసభావ విభూషిత
కవితన్ రామాయణమ్ముఁ ♦ గర్ణామృతముల్
భవహరమును వినిపించెదఁ
బ్రవిమల సోమేశ్వరాఖ్య! ♦ ప్రభువర! వినుమా.

## కథా ప్రారంభము.

(అయోధ్య — సభా భవనము.)

సింహాసనాసీనుఁడై నిండుకొలువుండి సభాసదులఁ గనుంగొని

దశరథమహారాజు:—

సీ॥ వివిధవిద్యలనెల్ల ♦ విమల విశ్వామిత్రు
ఘనగురుకులమునఁ ♦ గాంచినాఁడు
పసిపాపలనుజంపు ♦ నసురఁదాటకఁజంపి
సేమమ్ముఁ బ్రజలకుఁ ♦ జేసినాఁడు
బలమైన శివువిల్లు ♦ భగ్నంబుఁ గావించి
బాహుబలంబునఁ ♦ బ్రబలినాఁడు
రాజుల స్రుక్కించు ♦ రాజసంబున నిక్కు—
పరశురాముని భంగ ♦ పఱచినాఁడు

గీ॥ అట్టినాసుతు శ్రీరాము ♦ నమలచరితుఁ
నవిలి యువరాజుగాఁజేయఁ ♦ దలఁచినాఁడ
మీకు నభిమతమేయిది ♦ మిత్రులార!
మంత్రివరులార! ప్రజలార! మాన్యులార!.

పరమానంద సంభరిత హృదయారవిందులై ప్రజలందఱు:—

శంకరాభరణము — ఆదితాళము.

ధన్యులాదుమో నృపా! దశరథావనిపా!
పుణ్యమే రూపుదాల్చి ♦ పుడమియందుఁ బుట్టెననఁగ
మాన్యుఁడౌ శ్రీరామచంద్రు ♦ మానువొరగఁజేసిన ॥ధ॥
రవికులాబ్ధిపూర్ణచంద్రు ♦ రామచంద్రు సుగుణసాంద్రు
నవనిపా!యువరాజుఁ జేసిన ♦ నబ్బుఁగాదె నోముపంట.॥ధ॥

పరమోత్సాహముతోఁ బురోహితులగు వసిష్ఠులు:—

చ॥ దశరథరాజ! చేసె మన ♦ దాశరథిన్ గరుణాత్ము సత్కళా
కుశలుని యౌవరాజ్యమునఁ ♦ గొంకక పట్టముఁగట్టు, దాన నీ
యశము విశేషమై మెఱయు ♦ నర్కకులంబును వన్నెకెక్కెడున్
వశమగు సర్వసౌఖ్యములు ♦ వర్ధిలు సేమము భూప్రజాళికిన్

ఆనందాశ్రువుల రాల్చుచు మంత్రినిజూచి దశరథమహారాజు:—

కాఫి రాగము — రూపకతాళము.

రామచంద్రుఁడు రేపుప్రొద్దున ♦ రాజ్యభారముఁ బూనెడున్
ఏమిటన్ గొదలేకయుండఁగ ♦ నేర్పరింపు సమస్తమున్
బ్రేమమీఱ సుమంత్రి! బీదలఁ ! బ్రీతులను గావింపుమా
యీమహోత్సవమెల్లప్రజలకు ♦ నిష్టమై విలసిల్లగాన్.

[ కైకేయి యంతఃపురము. ]

శ్రీరామ పట్టాభిషేకమునకుఁ దనయంతఃపురము నలం
కరింపుచున్న కైకేయి తనదాసియగు మంథరతో:—

కాంభోజి రాగము — రూపకతాళము.

మంథరా! రేపె వేడుక మన పురంబున
నందఱీనగరవాసులా ♦ నందమొందఁగ ॥ 1 ॥
రామచంద్రుఁడు పట్టభద్రుఁడై ♦ రమణతో రేపె
కామిని! నాకాళ్లకెరఁగుఁ ♦ గనులపండువుగ ॥ 2 ॥

ఇంతికంటె హర్షమునన ♦ కేమిగల్గునే
అంతఃపురి మలంకరింతును ♦ వింతవింతగ ॥ 3 ॥
బీదసాదల కెల్లదానముల్ ♦ ప్రీతిఁగావింతు
ఆదరించి సేవకులకు ♦ మోదమిచ్చెదను. ॥ 4 ॥

మంథర దైన్యముతో:—

చ॥ సవతి కుమారునింగొలిచి ♦ సౌఖ్యమునందినవారిఁ గాన సీ
కువలయమందు బేలవయి ♦ కొమ్మరొ! పొంగెదు పొంగ
క్రుంగెదుగా
బ్రవిమలునీసుతుండు భరతుఁ ♦ బ్రాణమునీసిన మేలుగాదెయిం
ట్లవమతి చేయుకంటె నతి ♦ హా!మతిఁబాసి యిదేమిచేసితే.

మంథరమాట లక్ష్యపెట్టక కైకసంతోషముతో:—

సురట రాగము — రూపకము.

రాముఁ నెఱుఁగవే సుగుణో ♦ ద్దాము నెఱుఁగవే
ప్రేమ భరతు మీఱునతఁడు ♦ పేలవముగఁ జూడఁడెపుడు
ఏమిటఁగొదఁజేయఁడతఁడు ♦ ఎంతోమర్యాద పరుఁడు ॥ రా

మంథర మొగము చిట్లించి కైకను జూచి:—

కం॥ దొరతనముఁ గోరువారిటు
చరియింతురు గానియవలఁ ♦ జర్యలువేఱౌ
తరళాక్షి! నీకుఁ దెలియఁగఁ
దరమా! మున్ముందుఁ దెలిసి ♦ తలఁచెదవు సుమా

కైక భయపడుచు:—

కాంభోజి — రూపక తాళము.

మంథరా! యేమిగతి? ముందెనాకుఁ దెల్పవైతి
మందమతినై మోసపోతి ♦ ముందునాకేమిగతి. ॥మం

మంథర కైకనోదార్చుచు:—

ఉ॥ మిక్కిలిప్రేమఁజూచునను ♦ మేదినినాథుఁడటంచుఁ బల్కెదుగా
నిక్కము నాటికయ్యమున ♦ నెయ్యముఁజూపినదానిఁ దెల్పి నీ
వొక్కవరానఁ గానలకు ♦ నొక్కట రామునిఁ బంపఁగోరి వే
ఱొక్కవరాన నీసుతున ♦ యోధ్యకుఁబట్టముగట్టఁగోరుమా.

అని యుపదేశించి కైక నుండి బహుమానముఁగొని మంథర వెళ్లిపోవును. కైక యొక మూలలోఁ గోపము వచ్చిన దానివలె మాసిన చీర గట్టుకొని చెఱఁగు పఱచుకొని పరుండియుండగా దశరథుఁడు చూచి కైకతో:—

శంకరాభరణము — రూపక తాళము.

కోపమేలనె ప్రియా! - నాపయిసకియా
ఈపురి ప్రజలెంతో - యింపుతో వెలయ ॥ 1 ॥
చెఱఁగు పఱచినేలఁ - జెలి! పండనేల
అఱచేయి దిండుగా - సమరి యీలీల ॥ 2 ॥
తలయెత్తి కనువిచ్చి - కలికి! కనుగొనుము
అలయింపఁ బోకుము - అలిగి నామనము ॥ 3 ॥

కైక కన్నులునులుముకొనుచు శోకకోపంబులసూచించుచు:—

కం॥ ఆనాఁడు యుద్ధమందున
నేనొసఁగిన యట్టిసాయ ◆ మెల్ల మఱచితో
మానవనాథశిరోమణి!
మానము గాచినదిమఱచు ◆ మనుజుఁడుగలఁడే.

కైక నూరడించుచు దశరథుఁడు:—

జేగడ రాగము — రూపక తాళము.

కలికి! కోరినదిచ్చెద - కలఁగి యలుగకు - కలికి! కోరినదిచ్చెద
కలకంఠి! నీయుప - కారము మఱువనే ॥ కలికి ॥
చెలి! రథమును నడిపి - తెలిపిరిపుతంత్రము
నలిపి సాహాయ్యము - గెలుపు గల్గించితివి ॥ కలికి ॥

కైక సంతోషముతో:—

కం॥ పదునాలుగేండ్లు వనమున
వదలక రాముఁడు వసింపఁ ◆ బంపుము, భరతుం
బదపడిఁ బట్టము గట్టుము
ముదమున నయోధ్యకుం బ్ర ◆ మోదం బెసఁగన్.

దశరథుఁడు దుఃఖాక్రాంతచిత్తుండయి:—

నాథనామక్రియ — రూపక తాళము.

నామనోబ్ధిసోము సుగుణో - ద్దాము రాముని ప్రేమధా
ము( బాపనేల ॥ 1 ॥
భరతు రాజ్యనిరతుఁజేయు - వరము చాలక
వరుసమూరు వనముఁబంపు - వరమదేలఁక ॥ 2 ॥
కైక నీవు కపటివని - నాకుఁ దెలియక
నీకు వరంబొసంగి చెడితి - నిజమెఱుంగక. ॥ 3 ॥

శా॥ పాపీ! రాముని సర్వలక్షణయుతున్ ♦ బ్రాణప్రియున్ బాపిర
న్నెవన్ నావిధిసంపవచ్చితివిగా ♦ యీరూపమున్ దాల్చిసం
తాపంబేగతినోర్తురామ! సుగుణో ♦ ద్దామా! దయాసారమా!
నీపూర్ణేందుముఖమ్ముఁజూపఁగదరా ♦ నేఁబ్రాణముల్ పాసెదన్

అని మూర్ఛిల్లును:—

( సభా భవనము. )

పట్టాభిషిక్తుఁడగుటకు సర్వాలంకార శోభితుఁడై సీతా సౌమి
త్రులతోనేతెంచిన శ్రీరామునిఁజూచి వసిష్ఠుఁడు దైన్యముతో—

క॥ కైకేయి దేవినగరున
సాకేతపురీశ్వరుండు ♦ జాగొనరించెన్
నీకుంగనుఁగొనిరాఁదగు
నేకాంతమునుండురాజు ♦ నేనెటు గాంతున్.

( కైకేయి యంతఃపురము. )

మూర్ఛిల్లిన దశరథమహారాజునుజూచి చింతిల్లుచుఁ గైకను సమీపించి నమస్కరించి వినయముతో శ్రీరామచంద్రుఁడు:—

శంకరాభరణము — రూపకతాళము.

జనకుఁడిటు లుండుటకుఁ గతమేమి? - జననీ! తెల్పవే
జనకుఁడిటు లుండుటకుఁ గతమేమి
దినకరాన్వయ పార్థివేంద్రుఁడు - నినుఁడై యిటు దెల్పఁబా
యుచు ॥ జన ॥

తనయులుండఁగఁ - దండ్రికిది యేమి
వినెనఁ దెల్పుము - విశదముగనీ - మనమునందలి మాట
తెల్లను ॥ జన ॥

కైక నిర్లక్ష్యముతో:—

గీ॥ మున్ను వాగ్దాన మొనరించి ♦ యున్న రెండు
వరములనుబట్టి పదునాల్గు ♦ వత్సరములు
వనికి నినుఁబంపి భరతునిఁ ♦ బ్రభునిఁ జేయు
మనిన మూర్ఛిల్లెఁ దనపుట్టి ♦ మునిఁగినట్లు,

శ్రీరాముఁడు ధైర్యముతోను వినయముతోను:—
క॥ జనకుని వాక్యము సల్పఁగ
జననీ! వనమునకుఁబోదు ♦ సంతోషముతో

లక్ష్మణుఁడు కోపారుణిత లోచనుఁడై:—

ఉ॥ అన్న! యిదేమివెఱ్ఱిపయి ♦ యప్పుడె కానల కేగఁజూచెదా
యెన్నఁడు సూర్యవంశమున ♦ నీవిపరీతము గల్గెఁజెప్పుమా
యన్ననుమీఱి తమ్ముఁడెటు ♦ లందును రాజ్యమునిన్న నేఁడు నేఁ
డన్నఁగ రాజ్యమందునిచి ♦ తీరెదఁజూపెదమత్పితాపముక్

అని యొరనుండి కత్తినిదూసి కైకనుచుఱచుఱఁ జూచుచున్నా
డుఁ శ్రీరాముఁడు సౌమిత్రి వెన్నుఁదట్టి యూరడించుచు:—

క॥ జనకుని వాక్యము కంటెను
ఘనమేమన కేఁగ భుత్వ గౌరవమనుజా!.

గీ॥ మనకునై పుత్ర కామేష్టి ♦ మహినొనర్చి
కాంచిమనయాట పాటలఁ ♦ గడుఁజెలంగి
పెంచివిద్యల బుద్ధిఁజె ♦ ప్పించికట్టి
తండ్రిరెండవదైవమై ♦ తనరుఁగాదె
యతనిఋణమును దీర్పశ ♦ క్యమ్మెమనకు.

లక్ష్మణుఁడు ఉపకమిల్లి శ్రీరామునకు నమస్కరించి:—

గీ॥ అన్న! నాబొందిలోఁబ్రాణ ♦ మున్నవఱకు
నిచటనేకాదు శ్రీరామ! ♦ యెచటనైన
మీపదమ్ములఁ గొలుచుచు ♦ మెలఁగువాఁడ
విడచిపోయినఁ బ్రాణముల్ ♦ విడుచువాఁడ.

తానును వెంబడింతునని విన్నవించిన సీతనుజూచి శ్రీరాముఁడు.

ద్విపద॥ బహుదుఃఖములకిల్లు ♦ పడఁతి! వనమ్ము
విహరింపఁగఁదనమ్ము ♦ వెలఁది! వనమ్ము
ఘోరరాక్షసులకుఁ ♦ జోటువనమ్ము
క్రూరమృగమ్ముల ♦ కుదురువనమ్ము
విపరీత సదనమ్ము ♦ విపులవనమ్ము
ఉపవనమ్మదికాదు ♦ ఉగ్రవనమ్ము.

సీత:— కమాచ్ — రూపకము.

విడనాడుట తగునా
అడవులనిడుముల బడలికఁబడునని - పడఁతిని నీవిటు ॥విడ
చెనుగులలోనొడయునిఁదావిడనాడని- పడఁతి పడఁతి.॥విడ

క॥ మీవెంటనుండ నడవియుఁ
గేవలముగ స్వర్గమగును ♦ గృపఁజూపినను౯
మీవెంటఁగొని చనందగు
సేవించుచు ముందుఁద్రోవ ♦ సేయుచు వత్తు౯.

చ॥ అడవులఁబక్షికూజితము ♦ లందములౌ పొదరిండ్లుహాయిగా
కొదలిపరిశ్రమ౯దొలఁచ ♦ నొయ్యనవీచెడుమందమారుత
బెడనెడఁబక్వమై రుచుల ♦ కిమ్ములనందగుపండ్లుసౌఖ్యమె
య్యెడనొడఁగూర్చుఘోరమని ♦ యెంచఁగనేటికరణ్యవాసము౯

గీ॥ వనట నాకునోనర్చెడు ♦ వనము మీకు
సుఖమదెటు నొడఁగూర్చునో ♦ శుద్ధచరిత!
సాకులేలిఁక మీ వెంట ♦ సాగివత్తు
ధర్మమిది తప్పగారాదు ♦ ధర్మమూర్తి!.

అని సీత రాముని వెంబడించును:—

శ్రీరాముఁడు తండ్రిని సమీపించి నమస్కరించి:—

క॥ పదునాలుగేండ్లు పుచ్చెదఁ
బదునాల్గు దినంబులట్లు ♦ వగవకు తండ్రీ!
పెదవుల జారినమాటను
బదిలముగాఁ గాచుకంటె ♦ భాగ్యముగలదే .

దశరథుఁడు కన్నులనీరుగార్చుచు రామునిఁజూచి:—

క॥ రామా! సుజనారామా!
రామా! నా ప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

అని కన్నులు మూసికొనును:—

( కౌసల్య యంతఃపురము. )

మునివేషముతో రాముఁడు ప్రవేశింపఁగాఁ గౌసల్య జూచి శో కభయంబులు మనంబునఁ బెనఁగొన:—

ద్విపద॥ హా రామ! యిది యేమి ♦ యవతారమయ్య!
భేరీమృదంగముల్ ♦ ప్రీతి మ్రోయంగఁ
దేరెక్కి వచ్చిన ♦ దీవెనలిచ్చి
చేరి కౌగిటఁ జేర్చి ♦ చెలఁగుదుననుచు
నుండఁగా నా రామ! ♦ యోగివేషమున
గుండె జల్లనవచ్చు ♦ గోడిది యేమి?

శ్రీరాముఁడు చేతులు జోడించి:—

గీ॥ మున్ను వాగ్దాన మొసఁగించి ♦ యున్న రెండు
వరములనుబట్టి పదునాల్గు ♦ వత్సరములు
వనికి నన్నుఁబంప భరతునిఁ ♦ బ్రభునిఁ జేయ
జనకునింగోరెఁ గైకమ్మ ♦ చనెదవనికి.

కౌసల్య:—

గీ॥ రామ! నిన్నుఁ బాసి నేనెట్లు ♦ బ్రదుకఁగలను
కైక! నీకేల పెడబుద్ధి ♦ గలిగెనమ్మ!
అకట! ననుదుఃఖపెట్టెడి ♦ దొకటిదక్క
రాముఁడడవికిఁబోవ నీ ♦ కేమివచ్చు.

శ్రీరాముఁడు:—

గీ॥ పేరమాతకుఁ దగునెయీ ♦ విన్నదనము
తండ్రివాక్యము నెఱవేర్చు ♦ తనయుఁజూచి

తల్లిముదమందవలెఁగాని ♦ తల్లడిలుట
తగునె నీకిది నాతల్లి!♦ సుగుణవల్లి!.

క॥ పదునాలుగేండ్లు పుచ్చెదఁ
బదునాల్గుదినంబులట్లు ♦ వగవకు జననీ!
మదికుదుటఁబఱచి జనకుని
బదిలముగాఁ జూచికొనుము ♦ పతిహితమతివై.

కౌసల్య దుఃఖముతో:—

క॥ రామా! సుజనారామా!
రామా! నాప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!.

( సుమిత్ర యంతఃపురము. )

లక్ష్మణుఁడు తల్లిని సమీపించి:—
గీ॥ జనకువాక్యముఁబాలింప ♦ జనని! యదిగో
యన్నకానల కరుగుచు ♦ నున్నవాఁడు
అతనివెంబడి నేనిదే ♦ యడవులకును
నరుగుచున్నాఁడ దీవించి ♦ యనుపుమమ్మ!.

సుమిత్ర యెంతేయు సంతోషముతో:—

గీ॥ నిన్నుఁబోలిన సుతునినే ♦ నెమ్మిఁగాంచి
ధన్యురాలైతి లక్ష్మణా! ♦ ధన్యచరిత!
తండ్రిమాఱుగ రామునిఁ ♦ దల్లిమాఱు
సీతఁ జూచుచు వర్తిల్లఁ ♦ జెల్లుఁదనయ!

లక్ష్మణుఁడు దనభార్యయగు ఊర్మిళనుజూచి:—

క॥ నామాఱుగ నీయత్తలఁ
బ్రేమఁ గానేవించి నాకుఁ ♦ బ్రియమొనరుపవే
నామాటకు నెదురాడకు
నామన్ననఁ బడయఁగదవె ♦ నళినదళాక్షీ!.

( రాజమార్గము. )

వనమునకు రథారూఢుఁడై పోవుచుండు సీతాసౌమిత్రులతోఁడి
శ్రీరామునిఁజూచి ప్రజలు పట్టరాని దుఃఖముతో:—

గీ॥ ఈవు మారాజవౌదని ♦ యెలమియుండఁ
గైకపాగరింక నినుఁబంపెఁ ♦ గానవంకఁ
గమలమిత్రకులాబ్ధిరా ♦ కాశశాంక!
వత్తుమి దె వెంటఁ గొనిపొమ్ము ♦ వదల కింక.

అని మహావేగముతోఁ బోవుచుండు రథమును వెంబడింపఁజాలక

క। రామా! సుజనారామా!
రామా! మాప్రాణధామ! రవికుల సోమా!

రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

అని విలపించుచు మరలుచున్నారు:—

( చిత్రకూట పర్వతము. )

రాముఁడు చిత్రకూటపర్వతమును జూపుచు సీతతో:—

ఉ॥ చిత్రవిచిత్రపుష్పఫల ♦ చిత్రితవృక్షలతావిశేషముఁ
జిత్రవిచిత్రచర్మఖుర ♦ శృంగవిచిత్రితజంతుజాతముఁ
జిత్రవిహంగసేవితముఁ ♦ జిత్రమహాకుహారీసమేతముఁ
జిత్రఝరీప్రకాశితము ♦ సీత! యదేకను చిత్రకూటముఁ.

అని యాపర్వతమునుజేరి లక్ష్మణుఁడు పర్ణశాల నిర్మింపగానందు సీతారామసౌమిత్రులు నివసించుచుండిరి:—

( కైకేయి యంతఃపురము. )

శ్రీరాముని వనగమనమును సుమంత్రుఁడు మనవిచేయఁగా విని దశరథుఁడు ఏకధారగాఁ గన్నులసీరు గార్చుచు:—

క॥ రామా! సుజనారామా!
రామా! నాప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

అని విలపించుచుఁ బ్రాణములను వదలును:—

( కేకయ రాజధాని రాజభవనము. )

భరతుఁడు:— శత్రుఘ్నా! యీయుత్తరము వసిష్ఠులు వ్రాసినారు వినుము:—

చ॥ ఇనకులరత్నమా! భరత! ♦ యిచ్చటికార్యములెల్లఁ జూచిమీ
జననితలంచె నిన్నుఁగని ♦ జాగొనరింపక వేగరావలెన్
దినమొకకల్పమై జరిగె ♦ దీనినిఁజూచిన తక్షణంబర
మ్యనుమనివ్రాయఁదెల్పిన ద♦దంతయునీకిటఁదేటయయ్యెడున్

దీని యర్థమేమయి యుండును:—

శత్రుఘ్నుఁడు:— నేనును ఊహింపఁజాలకున్నాను. ఇప్పుడు మనము బయలుదేరవలయును:—

( అయోధ్య రాజవీధి. )

భరతుఁడు వినుచుండఁగాఁ బ్రజలు:—

క॥ రామా! సుజనారామా!
రామా! మాప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

అని విలపించుచుండుటనువిని శ్రీరామునకేమి సంభవించెనో యని

ని యుల్లము తల్లడించుచుండఁ దొందరగావచ్చి కైకేయి యంతఃపురమును బ్రవేశించుచున్నాఁడు:—

( కైకేయి యంతఃపురము. )

భరతుఁడు తల్లికినమస్కరించి దైన్యముతో శ్రీరాముఁడెక్కడ నని యడుగఁ గైకేయి:—

గీ॥ రామలక్ష్మణులరిగిర ♦ రణ్యమునకు
జనకుఁడో వృద్ధుఁడగుటను ♦ జనెను దివికి
నుత్తరక్రియ లొనరించి ♦ యుచితరీతిఁ
బట్టముఁగట్టికొమ్మనా ♦ పట్టి! నీవు.

భరతుఁడు కోపముతో:—

మోహన — రూపకము.

మాతవేకిరాతకీ! - ఘాత నేయుపాతకీ!
ఆతతసుగుణాభిరాము - నీతిమాలియడవిఁబంపితి ॥ మా ॥
రాతిగుండెదానవే - చేతమునుడికించితివే
పూతసూర్యవంశ వి - ఖ్యాతినెల్లఁజెఱచితే ॥ మా ॥

ఆ,వె॥ మాటఁదిరుగుకంటె ♦ మరణము మేలను
పతిని జంపినట్టి ♦ పాపినీవు
నాకు మాతవైతి ♦ లేకున్న నీపేరు
లేకమాతుఁగాదె ♦ లోకమందు.

## ( చిత్రకూట పర్వతము. )

లక్ష్మణుఁడు చెట్టుపైనుండు పండ్లనుగోయుచుండి యయోధ్య వైపుననుండి దుమ్ము లేగుచుండుటనుజూచి రామదర్శనార్థమై ప్రజలతో భరతుఁడు వచ్చుచున్నాఁడని తెలియక తమపై దండెత్తివచ్చుచున్నాఁడనుకొని రాముని సమీపించి:—

గీ॥ భరతుఁడిటువచ్చుచున్నాఁడు ♦ దురితమెంచి
పఱచినేనొక్క కోలను ♦ భంగపఱతుఁ
జూ షుమోయన్న! మనమీఁద ♦ దాడివెడలె
నింతకంటెను దురితము ♦ దేమికలదు.

కమాచ్ — రూపకము.

సెలవా? తులువ భరతుని - త్రుళ్లడంచెద సెలవా?
అలయొక్క బాణాన - నతనిశిరముఁజిమ్మి
కులమునకంతకుఁ - గూరిమినోడఁగూర్తు. ॥సెలవా॥

శ్రీరాముఁడు:—

క॥ తొందరపడకుము లక్ష్మణ!
యెందునమదిఁ గీడుదలఁచి ♦ యెఱుఁగడు భరతుం
డెందులకువచ్చెనోయిటుఁ
గంపముకారణమువచ్చి ♦ కాంచినపిదపన్.

ఇంతలో భరతుఁడువచ్చి రాముని పాదములకెరగి చేతులుజోడించి కన్నీరు గార్చుచు నిలుచుండఁగా రాముఁడు నాయనగారు సేమమాయనియడుగ భరతుఁడు:—

గీ॥ రామ! ననుఁదమ్మునిగఁ గాంచి ♦ రాజ్యమెడలి
యడవిఁబోవఁగ నాయెనా ♦ యన్న! నీకుఁ
దండ్రి ననుఁ బుత్రునిగఁగాంచి ♦ తల్లడిలుచుఁ
దనువు వదలంగవలసె నే ♦ మనుదు రామ! .

అని విలపించును:—

శ్రీరాముఁడు తండ్రినిఁదలంచికొని:—

క॥ సత్యమువిడువంజాలక
సత్యవ్రత! మృత్యుసుఖము ♦ శరణువడసితే
నిత్యమగు కీర్తిఁగాంచియ
నిత్యపు దేహమునుబాసి ♦ నీవిటుతండ్రీ! .

అని విలపించి భరతా! మనమిరువురమునుగలసి పూజ్యులగునాయనగారి వాక్యమును జెల్లింపవలసియున్నది. నేను వనవాసముచేసి చెల్లించెదను. నీవు పట్టాభిషిక్తుఁడవై చెల్లింపుము. అయోధ్యకుఁబోయి పట్టాభిషిక్తుఁడవుగమ్మి:—

భరతుఁడు:—

ఉ॥ ఒల్లనురాజ్యమాపదవు ♦ లొల్ల నయోధ్యనునొల్ల మాతనే
నొల్లను బంధుమిత్రతతి ♦ నొల్లశరీరపుసౌఖ్యమొల్లనే
నొల్లనుగానగీతముల ♦ నూర్జితరీతిని మీపదంబులన్
గొల్లగ సేవఁజేయఁగనె ♦ కోరితి నిమ్ము కృపాసముద్రమా!

రాముఁడు— భరతా! నీకు నయోధ్యలోనుండుట కిష్టములేదేని

కాఫి — రూపకము.

పొమ్ము నందిగ్రామమందునఁ - బొందికన్ జనులందఱున్
సమ్మతింపఁగనాకు మాఱుగ - సల్పిరాజ్యము క్రమ్మఱన్
దెమ్ముపదునాల్గేండ్లపిమ్మటఁ - దీర్చి జనకునివాక్యమున్
నెమ్మితోనేమరలినప్పుడు - నెయ్యమిట్టులె చూపుచున్.

భరతుఁడు:—

గీ॥ పట్టమున్ గట్టియన్న! మీ ♦ పాదుకలకు
మించుమునివృత్తిఁ బ్రజలఁ బా ♦ లించువాఁడ
మీరురాఁగల సమయంబు ♦ మించెనేని
నగ్నిమార్గాన స్వర్గాన ♦ కరుగువాఁడ.

క॥ రామా! సుజనారామా!
రామా! నాప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

అపిరాముని పాదుకలను శిరముపై నిడుకొని మరలును:—

( పంచవటి. )

తాను మిక్కిలి చక్కనిదను నభిమానముగల శూర్పణఖయను పేరుగల రావణుని చెల్లెలు రామలక్ష్మణులనుజూచి మోహించి తనలో:—

శంకరాభరణము — రూపకము.

ఇంతటిచక్కనివారల నెచ్చట - నెన్నఁడుగనలేదు
సంతతమును జనులనగవ్వులవింతగ - సంతసపఱచెదరు ॥ 1 ॥
అందమురూపంబెత్తినరీతిని - నుందురుగదవీరు
డెందము పరమానందముఁబొందును - బొందినవీరలను ॥ 2 ॥
కనులకునలనుగఁ గలికియొకర్తుక - కనఁబడు వీరలతోఁ
జని పనికత్తెగనుండి దానినిఁకఁ - జంపి సుఖించెదను. ॥ 3 ॥

ఇట్లనుకొని వారినిసమీపించి మువ్వురకును మూడు పూలహారములు సమర్పించి శ్రీరామునితో:—

గీ॥ దిక్కులేనియనాథను ♦ దీనురాల
యభయమిచ్చెడి వారొక ♦ రైన లేమిఁ
దికిగి వేసారితిని నన్నుఁ ♦ గరుణఁజూచి
శరణ మొసఁగిన మీసేవ ♦ సలుపుదాన.

శ్రీరాముఁడు లక్ష్మణునితో:—

గీ॥ అంతలేని యనాథఁట ♦ యుండనిమ్ము
సీతకొకయింత పరిచర్య ♦ సేయఁగలదు
ఒంటిగానున్న వేళఁ గా ♦ వుండఁగలదు
అలివలెంతయుఁ గోరుదు ♦ రామతోష.

శ్రీరాముఁడు శూర్పణఖతో:—

గీ॥ సీతచెప్పిన పనులను ♦ జేయుచుండి
యోగ్యవర్తనగల్గి నీ ♦ వుంటివేని
మదినినీకు భయమ్మను ♦ మాటలేక
హాయిగానుండఁగలవు మా ♦ యాశ్రమమున.

( గోదావరీ తీరము. )

సీత లోతైనమడుగులోనికిదిగి ముక్కును జెవులను మూసికొని స్నానముజేయుటకై మునుకవేయుచుండఁగా శూర్పణఖ ముంచి చంపవలయునని గొంతుపైఁజేయివేయును:—

సీత:— క॥ రక్కసిపట్టెను రామా!
రాముఁడు:— ఎక్కడ లక్ష్మణుఁడు
లక్ష్మణుఁడు:— చిక్కె నిదెపడెశిలపై
ముక్కు చెకచెక్కలయ్యెను
రాముఁడు:— జక్కఁగఁబోనిమ్ముదానిఁ ♦ జంపకుమనుజా!.

( జన స్థానము. )

శూర్పణఖ సురాపానముఁ జేయుచున్న తన బంధువులును సేనాధిపతులును నైన ఖరదూషణత్రిశిరాదుల సమీపించి:—

నాథనామక్రియ — రూపకము.

అన్నలారా! నన్నుఁ జంపరే
అన్నరాఘముల్ సేసిన - బన్నమేనోర్వఁజాల ॥ అన్న ॥
నన్నుఁజూచి మోహమంది - కన్నుసైగఁజేసినన్
అన్న! తిట్టనన్నుఁబట్టి - యిన్నిపాట్లుపెట్టిరే. ॥ అన్న ॥

ఖరుఁడు:—

చ॥ అలలల వారిగుండియల ♦ వ్రక్కలుపడ్డఁబొడిచి పేర్చి నా
చలముబలమ్ము తేటపడఁ ♦ జంపెదశూర్పణఖా! సహోదరీ!
విలవిల యేడ్వఁబోకుమిను ♦ వేదనఁబెట్టిన వారిమొండెముల్
తలలనువేఱుచేసి యిదె ♦ తప్పక తెచ్చెదవారిఁజూపవే.

అని ఖరుఁడు దండెత్తి పోవుచున్నాఁడు. శూర్పణఖ దారిచూపుచున్నది:—

( పంచవటి పర్ణశాల. )

లక్ష్మణునిఁజూచి రాముఁడు:—

ఉ॥ తమ్ముఁడ! మూఁడురక్కసులు ♦ దండులవే మనమీఁదవచ్చెడిన్
గొమ్మనుజూచికొమ్మదిగో ♦ కోయను బొబ్బవినంగవచ్చెనే

నెమ్మియివారిఁజంపియిదే♦యిప్పుడేవచ్చెదఁబొమ్మనాదుష
ల్లమ్ములఁదెమ్మనీవుతను♦వంతటఁగన్నులుగల్గియుండుమా.

( ఒక గుట్ట. )

దానిపైనుండి గురిఁజూచి శ్రీరాముఁడు రక్కసులపై బాణము
లఁ బ్రయోగించుచున్నాఁడు:—

శూర్పణఖ:— (హా

చ॥ అదెయదెవచ్చెవచ్చెఖర! ♦ యమ్మదిదూషణుఁజంపెఁజం
యిదెయిదెమించుమించసఁగ ♦ నీత్రిశిరుందెగటార్చెనీశర
బదెయదెగుండెజల్లనఁగ♦వందఱఁగూల్చెనిదొక్కటూ పెహా
యదెవడివాడిబాణమదె ♦ హాఖర! నిన్నునుజంపివైచెనే.

( లంకే రావణుని యేకాంతమందిరము. )

శూర్పణఖ:—

కాంభోజి — రూపకము.

అన్నా! నీకొక్క - వన్నెలాడిని వెదకి - యిన్నిపాటులుపడితి
విన్నవించెదనేను- మన్నించునాపలుకు- బన్నమొందఁగలేన
బంధులిందఱిలోన ॥ అన్నా ॥

రావణుఁడు:—

క॥ బన్నమునీదట్లుండనె
యన్నాకీ రత్నమెవరె? ♦ యదిదెలుపవెనేఁ
గన్నారఁగాంచి తెచ్చెద
నెన్నేని నుపాయముల న ♦ దెచ్చుటనున్నా.

శూర్పణఖ:—

శా॥ అన్నా! రావణ! నేను జూచినది లే ♦ దాయందమెందేని వే
కన్నుల్ గావలెఁ జూడఁ గావలసినన్ ♦ గల్యాణిలావణ్యమున్
గన్నన్ జెప్పలబోలెఁగా చెదరుపీఁ ♦ కన్ రామసౌమిత్రులో
యన్నా! పంచవటీతటంబుకుమహా ♦ యత్నంబు చేసాధ్యమా

క॥ నీభోగభాగ్యగరిమకు
నాభవ్యాంగనయుఁగూడ ♦ నలవడెనేనిన్
శోభకుఁదోడుసుగంధ
ప్రాభవమంచుటయొకాదె ♦ స్వర్ణంబునకున్.

( పంచవటి పర్ణశాల. )

రావణుఁడు సన్యాసివేషముతో సమయమును నిరీక్షించుచుఁ జెట్లసందున డాగియుండఁగా:—

సీత పర్ణశాల వాకిట నిలఁబడి లక్ష్మణునిజూచి:—

మ॥ కనుమో లక్ష్మణ! జింకనుందటుము వ్యా ♦ ఘ్రుంబున్ వడిన్ గూల్పఁగా ]
వెనువెంటన్ జనుచున్న వారిదిగో వే ♦ విల్లందిమీయన్నగా
రనురాగాతిశయంబ దెంతటిదో యన్నా! దూరమున్ గీరమున్
మొనరాల్లున్ గినరాళ్ళు చూడకకరం ♦ బున్ బారుచున్నారదే.

రావణుఁడు తనలో:—

గీ॥ పులిని వెన్నంటి రాముండు ♦ పోయెఁగాని
యతని వెదకంగ లక్ష్మణుం ♦ డరిగె నేని
నొంటిగాఁ బర్ణశాలయం ♦ దుండుకతన
సులభముగఁ జిక్కునాకు నీ ♦ సుందరాంగి.

( అడవి. )

శ్రీరాముఁడు:—

గీ॥ మించు గురిఁ జూచి వ్యాఘ్రము ♦ ద్రుంచి వైచి
కడకు లేడిని గావంగఁ ♦ గంటిఁ గాని
చాల దూరము వచ్చితి ♦ జాలము య్యె
దేవి నాజాడఁ గనకభీ ♦ తిల్లునేమొ
శీఘ్రముగఁ బర్ణశాలనేఁ ♦ జేరవలయు.

( పంచవటి. )

సీత తనలో:—

ముఖారి — రూపకము.

తడవేల చేసెనో - ధరణీశుఁడకట
అడవులఁ బడిపోయి - కడుబడలినాఁడో ॥తడ॥
అటుపోయి దూరాన - ఆకొండచాటున - తటుకునఁ గను
మఱుఁగై తడవాయె రాఁడు. ॥తడ॥

లక్ష్మణునిజూచి ప్రకాశముగా:—

శా॥ అన్నా! లక్ష్మణ పోయియారయఁగదే ♦ యానందసంవర్ధనున్
మన్నాథున్ మహనీయసద్గుణహితున్ ♦ మత్ప్రాణసంతోషణున్
మున్నెన్నండును జేయఁడింతతడవున్ ♦ బోపొమ్ము వేవేగమీ
యన్నన్ దెచ్చి మదీయహృద్గతవిచా ♦ రాగ్నిన్నివారింపవే.

లక్ష్మణుఁడు:—

హంసధ్వని — రూపకము.

తల్లి! వెఱువకు - మాతల్లి! వెఱువకు
తల్లడిల్లి తెల్లబోఁకు ॥తల్లి॥
చల్లపడితోడనే - యుల్లమురంజిల్లఁగా
అల్లమాయన్నగారు - చల్లగానువత్తురు. తల్లి॥

సీత:—

చ॥ కపటమునీమనంబునను ♦ గల్గఁగఁ బోలును లేకయున్న నీ
వపకృతులందొఁ బొంగియిటు ♦ లుందువె లక్ష్మణ! యన్నజాడఁ బో
కపయశముం గడించితివె ♦ యన్న్యుఁడవే! నెనరైనలేదె నా
తపములపంట మాపతికిఁ ♦ దమ్ముఁడవై యిటుసేయఁజెల్లునే

లక్ష్మణుఁడు:—

గీ॥ ఒంటిగాఁదల్లి! నినునాకు ♦ టెంటవదలి
పోవఁజాలకయుంటి నేఁ ♦ బోయివత్తు
వేఱుగా నెంచఁజాలునే ♦ విమలసూర్య
వంశమణియగు దశరథు ♦ పట్టిపేఁడు.

అని వెడలిపోవును:—

( పంచవటి పర్ణశాల. )

రావణుఁడు సన్న్యాసివేషముతోఁ బర్ణశాలసమీపించిసీతతో:—

కమాచ్ — రూపకము.

భిక్షపెట్టవే - అక్షయముగనాకునొక్క - భిక్షపెట్టవే
భిక్షవేఱుకాదు - నీకటాక్షముంచిపోవవే
రాక్షసేశ్వరుండనాకు - రాణివై చెలంగవే ॥ భిక్ష ॥

సీత భయపడి దూరముపోవుచున్నది:—

రావణుఁడు మఱింత సమీపించి:—

శరణమియ్యవే - తెరళేనయన! తాళఁజాల - శరణమియ్యవే
తరుణి!నామనంబెఱింగి - ధన్యుఁజేసికావవే
అరయనామరాజ్యరమకు - నందమై చెలంగవే ॥ శరణ ॥

సీత ధైర్యముతో:—

శా॥ ఓరీ పాప పరాయణా!వదరెదే ♦ యుక్మత్తతన్ రావణా!
శూరాగ్రేసరురామచంద్రుఁ యువతిన్ ♦ జోరుండవై డాయుదే
నీరాజ్యంబునునిన్ను నీదళములన్ ♦ నిర్మూలముం జేయునా
శ్రీరాముండిదెచేరవచ్చుఁదనదో ♦ ర్వీర్యంబవార్యమ్ముగాన్

రావణుఁడు:—

క॥ నామమందు రాము గీముని
నేమని పొగడెదు సురేంద్రుఁ ♦ డే మొదలుసురల్
నా మరుఁగుఁ జొచ్చి బ్రదుకఁగ
లేమా! తెమ్మింక జాగు ♦ లేదిట సీకున్.

సీత భయముతో:—

శా॥ రామా! రక్కసు బారిఁ జిక్కబడితినే ♦ రావే. శరౌఘంబుచే
నీ మూర్ఖున్ ధనుజాధమున్ దునుమవే ♦ యీడ్చెంగదే తక్కులన్
నా మానంబెటు గాచికొందు నెకదే ♦ నన్బ్రోచు వారెవ్వరే
యేమీ యంచను వారుఁ గూడ నిట లే ♦ రే యీశ్వరా! కావవే.

సీత రావణుని విమానముపైనుండి:—

ఉ॥ భూమికి వ్రాల్తి ప్రాణములఁ ♦ బుచ్చెద రావె మదీయ దేహమున్
రామ! త్వదీయ హస్తములఁ ♦ బ్రజ్వలితాగ్ని నిసంస్కరింపవే
నీ మొగమున్ గనుంగొనుచు ♦ నే నసువుల్ విడనాడు పుణ్యమున్
రామ! కనంగనైతిఁగదె ♦ రాజకులాంబుధిపూర్ణచంద్రమా!

సీతను లాగి విమాన స్తంభమునకుఁ గట్టి రావణుఁడు:—

క॥ ఇక్కడి కాకులు చిలుకలు
నిక్కడి యీ పెద్దగ్రద్ద ♦ యిట్టులు నన్నున్
ముక్కులఁ బొడువం జొచ్చెను
తెక్కులఁ జెక్కెదను సీత ♦ తెచ్చపడంగాన్.

అని గ్రద్దను నఱికివేయును:—

సీత:—

క॥ అయ్యో! గ్రద్దా! నాకయి
నెయ్యముచేసితివె కొనకు ♦ ఖడ్గపుధారన్
నెయ్యా మెఱిఁగించిపడితే
యియ్యధమాధమునిచేత ♦ హీనునిచేతన్.

సీతతననగలను జెఱఁగులో మూటగట్టి విమానమునుండి వేయుచు

చ॥ వనచరులార! రామనృప ♦ పత్నినినన్ను బలాత్కరించియీ
దనుజుఁడుదొంగిలెన్ వినుఁడు ♦ తప్పక వెన్ వెదకంగ రాముఁడీ
వనమునుజొచ్చునప్పుడివి ♦ వారకనాదగు భూషణంబులన్
గనికరముంచియిందునను ♦ గావఁగ దెల్పుఁడు పుణ్యమబ్బెడున్.

రావణుఁడు సీతతో:—

సీ॥ సీత! నీకివెమంచి చీనాంబరములుండ
నారచీరలివేల ♦ నారి! నీకు
నవరత్నమయభూష ♦ ణంబులెన్నియొయుండ
సడవిపూవులివేల ♦ యతివ! నీకు
చారుచంద్రోపల ♦ సౌధమ్ములివియుండఁ
బర్ణశాలలవేల ♦ పడఁతి! నీకు
వివిధమద్యమ్ములున్ ♦ వెలయుమాంసములుండఁ
గందమూలములేల ♦ కలికి! నీకు

గీ॥ నిరుపమానపరాక్రమ ♦ తరుణతరణి
కిరణవిదళిత శత్రుని ♦ కరమహాంధ
కారుఁడై ముజ్జగంబులఁ ♦ బేరుగొన్న
రాక్షసేశ్వరుఁడేనుండ ♦ రాముఁడేలొ.

( అశోకవనము )

సీత:—

క॥ రామా! సుజనారామా!
రామా! నాప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

( అడవి )

రాముఁడు లక్ష్మణునితో:—

తోడి—రూపకము.

అటుసీతనుంచి నీ - విటురాఁగఁజెల్లునే
కుటిలాత్ము లెందరో - యటవిం జరింతురే　　॥అటు॥
పదవేగలక్ష్మణా! - పద్మాక్షిఁజూతము
అదియేమొ తెలియదు - మదిలోగలంగెను　　॥పద॥

రాముడు:—

శా॥ సీతా! సీత! పతివ్రతాతిలకమా! సీమంతినీరత్నమా!
సీతా! యీకుటి విన్నవోయెఁ గదవే సీతా!మనోహారిణీ!

సీతా! పిల్చిన వచ్చిపల్కవుగదే సీతా! సుధాభాషిణీ!
సీతా! నన్విడనాడఁజాలకవనిఁ సేవించి నన్బాసితే.

రాముఁడు లక్ష్మణునితో:—

సీ॥ జలకమాడంగను ♦ జలజాక్షి పోయెనో
తమ్ముడా! చూడుము ♦ తడయఁబోకు
కొమ్మపూల్కోయంగఁ ♦ గొమ్మపై కెక్కెనో
తమ్ముడా! చూడుము ♦ తడయఁబోకు
పులిజాడయేమైనఁ ♦ బొడగాంచఁగ్లైనో
తమ్ముడా! చూడుము ♦ తడయఁబోకు
తలుపువెన్కనుడాగి ♦ తెరళాక్షియున్నచో
తమ్ముడా! చూడుము ♦ తడయఁబోకు
గీ. పెద్దకాళ్లనుచిరుకాళ్లు ♦ వేలువేలు
గానఁబడెరక్కసుండు దాఁ ♦ గాంతఁగొంచు
నేగియుండునుగాఁబోలు ♦ వేగసరిగి
వెదకుదమురమ్ము తమ్ముఁడా! ♦ వెలఁది నిచట

(అడవి)

రాముఁడు:— ఖరహరప్రియ — రూపకము.

ఎటుమరచియుందు - ఇందువదన! నిన్ను - నెటు మరచియుం
కటకటా! నీరూపు - కనులఁగట్టియుండ ॥ఎటు॥
ఇటులేళ్లమేపి - యటఁజెట్లఁబెంచి - యిటఁబక్షులను సాకు
నెటఁబోతివీవు ॥ఎటు॥

( శబరి యాశ్రమము. )

శబరిరామునితో:—

గీ॥ రామ! నీరామఁగొనిపోయె ♦ రావణుండు
ప్రాణమర్పించె నెదిరించి ♦ పక్షిరాజు
విన్నవింపంగ నేనిట ♦ నున్నదాన
శబరినాపేరు తపమును ♦ సలుపుదాన
భక్తి నేనిడుతీయని ♦ పండ్లఁగొనుము
పంపదరిగిరి సుగ్రీవు ♦ పజ్జఁజేర
శుభమగును బొమ్ము శ్రీరామ! ♦సుగుణధామ!.

శ్రీరాముఁడు లక్ష్మణునితో:—

గీ॥ పరహితమె తమధర్మమై ♦ పరఁగుచుండు
నీమహోదారచిత్తుల ♦ కెవరు సములు
ఏమిచేసినతీరునీ ♦ యింతిఋణము
ప్రాణమర్పించినట్టియీ ♦ పక్షిఋణము.

( పంపాసరోవరము. )

శ్రీరాముఁడు లక్ష్మణునితో:—

గీ॥ సదమలంబగు జానకీ ♦ చరితవోలె
రాజిల్లుచునుండు పంపాస ♦ రమ్ముఁజూడు
దీనిచక్కని చల్లని ♦ తీరమందు
శాంతముగ విశ్రమింతము ♦ కొంతతడవు.

ఎదుటి ఋష్యమూక పర్వతమునుండి దిగివచ్చుచుండు నొకనిఁ జూచి శ్రీరాముఁడు:—

గీ॥ బ్రహ్మతేజంబు ముఖమునఁ ♦ బరఁగువాఁడు
బలజవంబుల నెంతయుఁ ♦ జెలఁగువాఁడు
అదిగో దిగి వచ్చుచున్నవాఁ ♦ డద్రినుండి
యాతఁడెవ్వఁడో లక్ష్మణా! ♦ యరసిరమ్మ.

గిరి దిగివచ్చిన హనుమంతుఁడు లక్ష్మణునితో:—

గీ॥ అన్న తనకాంతఁ బట్టిన ♦ ఖిన్నుఁడగుచు
నద్రినుండెడు సుగ్రీవుఁ ♦ డడవిఱేఁడు
మీరలెవ్వారో గనుఁగొనఁ ♦ గోరి పంపె
నతనిమంత్రిని హనుమంతుఁ ♦ డందు రన్న.

లక్ష్మణుఁడు శ్రీరామునిఁ జూపి హనుమంతునితో:—

చ॥ ఇనకులరత్నమా దశర ♦ థేశుని పుత్రుఁడు పేరు రాముఁడీ
జనకునివాక్యపాలనము ♦ సల్పవనంబుననుండ జానకీ
వనసతిఁ గోలుపోయె విను ♦ తత్పతినారయవచ్చి యిచ్చటన్
జనపతి యున్నవాఁడుదన ♦ సాయము మీపతికిచ్చఁగోరెనన్

హనుమంతుఁడు సుగ్రీవునిఁ దోడ్కొనివచ్చి శ్రీరామునికిఁ జూపి :-

సీ॥ వాలిబలశాలి తనప్రియయు ♦ రాలిఁ బట్టి
ఖిన్నుఁడై యద్రినుండు సు ♦ గ్రీవుఁడిదిగో

శరణముఁ జొచ్చెను శ్రీరామ! ♦ కరుణఁ జూడు
దీనరక్షయె నృపులకు ♦ దీక్షగాదె.

శ్రీరాముఁడు సుగ్రీవునితో:—

ఉ॥ నీరిపు ప్రాణవాయువుల ♦ నేనొక బాణముచేతఁ గ్రోలినీ
దారను రాజ్యముఁ మరలఁ ♦ దప్పక నీకొదవంగఁ జేసెదన్
ధారుణి తారుమారయినఁ ♦ దప్పదు నావచనంబు చూడుమో
వైరికలోకపాలక! స ♦ ఖా! యిదె చేతను జేయివేసితిన్.

సుగ్రీవుఁడు:—

చ॥ దినకరవంశపావన! మ ♦ దీయపురాకృతపుణ్యరూపమో
యనని టనా మనోరథము ♦ నంతను దీర్పఁగనున్నవారు మీ
యనుచరుఁడై మెలంగెదను ♦ నందులసాక్షిగఁ గొండుమీ సతిన్
దనుజుఁడు గొంచుపోవునెడఁ ♦ దత్సతి రాల్చిన భూషణావళిన్

సీత తన నగలఁ గట్టివైచిన చెఱఁగును జూచి శ్రీరాముఁడు తనలో

సీ॥ ప్రణయకోపపువేళఁ ♦ బడఁతి! నీపడకగాఁ
జెలువు గాంచినదియా ♦ చెఱఁగుగాదె
ఎండగాచెడివేళ ♦ నింతి! నీగొడుగుగాఁ
జెలువుగాంచినదియా ♦ చెఱఁగుగాదె
చెమటపెట్టినవేళఁ ♦ జేతివీవనగాఁగఁ
జెలువుగాంచినదియా ♦ చెఱఁగుగాదె

నా కాళ్ల తడియొత్త ♦ నీకు వస్త్రమ్ముగాఁ
జెలువుగాంచినదియా ♦ చెఱఁగుగాదె

గీ॥ అట్టి చెఱఁగున నగలను ♦ గట్టి యిట్లు
నాకు గురుతుగ రాల్చితే ♦ నాతిమిన్న!
సీత! నీమాఱుదీనిని ♦ బ్రీతిఁజూతు
సీత! నినుఁబొందువాఁడు నీ ♦ చేతికిత్తు.

( కిష్కింధ. )

వాలి తారతో:—

గీ॥ నెఱపి నెయ్యమ్ము రాముఁడేఁ ♦ నృపతితోడ
నన్నుఁజంపంగ సుగ్రీవుఁ ♦ డున్నవాఁడు
పడివడిగఁబోయి పైఁబడి ♦ పిడుగువోలె
నిరువురను వచ్చి వచ్చెద ♦ నిపుడె చూడు
తార! సుగుణవిహార! సౌం ♦ దర్యపూర!.

తార:— కమాచ్ — రూపకము.

పరనారీసంపర్కము - పరమదురితము - పరనారీసంపర్కము
దరిలేని దుఃఖము - దొరకొనఁజేయును ॥ పర ॥
సిరుల దొలంచును - జిరకీర్తి మాపును - పరమ పూరునికైనఁ
బరిభవమొనరించు ॥ పర ॥
చరణములను బడి - స్వామి! నిన్వేఁడెదఁ - దరళాక్షి నారుమను
దెమ్మని కొసఁగుము. ॥ పర ॥

వాలి:— శంకరాభరణము — రూపకము.

చాలుఁజాలు తాఁ!ని - ర్మాలమిపుడు చేసెదఁ
చాలవాగఁబోకుతాఁ!- చావమోదివేసెద.

(పంచాక్షరము.)

శ్రీరాముఁడు సుగ్రీవునితో:—

గీ. సామమునఁగార్యమెుపవి, ♦ నేమమునఁగవ
యనుజుఁబంపెదసంధికా ♦ ర్యమ్ముఁదీర్ప
వాలివినకుండ నెదిరింప ♦ వచ్చెనేని
నొక్కబాణంబుచేవాని ♦ నుక్కడంతు
భయముపడకుము సుగ్రీవ! ♦ భవ్యభావ!.

హనుమంతుఁడు అతిశయమ్ముశ శ్రీరామునిసమీపించిప్రభూ!:—

గీ॥ ఉరుముఁబోలినభీకర ♦ స్వరముతోడఁ
జండమారుతమట్లు ప్ర ♦ చండగతిని
వాలిమనపయివాలఁగా ♦ వచ్చెనదిగొ

అని వాలిని జూపును శ్రీరాముఁడొక్కబాణముతో వాలినిదెగ టార్చును:—

హనుమంతుఁడు:— అహాహా!రాఘవ!నీశరం ♦ మద్భుతంబు
పగతుంతల నదెగొంపోయె ♦ గగనమునకు.

అందరు సంతోషముతో:—

( కమాచ్ — రూపకము. )

రామరాజభూషణ! రాక్షసకులభీషణ! సామమధురభాషణ!
సాధుతాపశోషణా! . ॥ రామ ॥

శ్రీరాముఁడు సుగ్రీవునితో:—

గీ॥ ఆగ్రహముమాని సుగ్రీవ! ♦ యగ్రజునకు
నుత్తరక్రియలొనరించి ♦ యుచితరీతి
తారనోదార్చి తత్సుతుఁ ♦ జేరఁదీసి
యేలుమిఁక కిష్కింధ నిశ్శంక ♦ నేలుమింక.

( కిష్కింధవెలుపలిమైదానము ) ( బయలు. )
సమస్తసేనాధిపతులతోఁగూడి సుగ్రీవుఁడు రాఁగా శ్రీరాముఁడు

ఉ॥ యోజనమబ్ధినీదితగు ♦ యుక్తినిలంకనుజొచ్చిసీతస
ద్రాజనిభాననన్ వెదకి ♦ రాగలవీరుని చేతికిత్తునా
పూజితమంగుళీయకముఁ ♦ బొల్పుగసీతకునానవాలుగా
నాజనకాత్మజాకుశల♦ మారయునాతఁడునాకుఁబూజ్యుఁడే

హనుమంతుఁడు ముందరికువచ్చి శ్రీరామునిఁజూచి:—

గీ॥ రామ! మీభక్తునకుసము ♦ ద్రంబదెంత
యసురపురమెంతమాత్రను ♦ నరయుటెంత
గాంచిదేవిని రావణు ♦ గర్వమడఁతుఁ
బంపుమిదెపోయివచ్చెదఁ ♦ బ్రభువతంస! .

( లంక, మహాద్వారము. )

లంకాధిపతియగు రావణేశ్వరుని యుత్తరువులేనిది యెవరును లంకలోనికిఁ బ్రవేశింపఁగూడదని ద్వారపాలకుఁడు హనుమంతు నిషేధించెను. హనుమంతుఁడు ఆద్వారపాలకుఁడు ఆశ్చర్యపడు నట్లు తనతోఁడలోని రక్తముఁదీసి యొకపెద్దముల్లుతో నొకవిశాలమైన యాకుపై నొకయుత్తరమునువ్రాసి లంకాధీశునకుఁ బంపవలయునని ద్వారపాలకునకునిచ్చెను:—

( లంక, సభాభవనము. )

రావణుఁడు ఆలకింపఁగాఁ బ్రహస్తుఁడు హనుమంతునియుత్తరము నిట్లుఁ జదువుచున్నాఁడు:—

శా॥ ముల్లోకంబులరాజులెల్లవడఁకన్ మోదంబుతోనేలునో
కల్లోలాంచితభూరివార్ధివృత లం ♦ కాద్వీపరక్షోధిపా!
మల్లుండన్ దమమల్లరంగమున స ♦ న్మానంబుఁబొందంగనా
యుల్లంబున్నదిపన్నవించితిఁబ్రభూ! ♦ యుష్మత్ప్రసాదంబుకై

రావణుఁడు తక్షణమేపిలువనంపవలయునని యుత్తరువుచేసెను. హనుమంతుఁడు బ్రవేశించి మొగ్గలో మొగ్గలో మొగ్గవేసి అనఁగా అంతరాంతరపల్టీగొట్టి చేతులుజోడించి నిలచి రావణేశ్వరుని యాశ్చర్యములో ముంచివేసెను:—

హనుమంతుని జూడఁగనే మల్లురందఱుగుండెలోరాయి పడిపోయెను:—

రావణుఁడు హనుమంతునకు గొప్పగొప్పబిరుదులను గొన్నతన జగజెట్టిలనుజూపి వీరిలోనెవరితోఁబోరెదవనియడిగెను:—

హనుమంతుఁడు అందఱితో నొక్కతూరి పోరెదనని చెప్పి రావణేశ్వరుని యెట్టయెదుటనిలఁబడి తనరెండుభుజములనుజాచి మల్లురనందఱనుబిలచి గట్టిగా విడువకుండఁబట్టుకొనవలెనని యాజ్ఞాపించెను. అట్లువారుపట్టుకొన్న వెంటనే యొక్కసారిగిఱ్ఱుమని తిరిగెను. వారందఱు విసరివేసినట్లు నలువైపుల దూరముగఁబడి పోయిరి. కొందఱకుఁగాళ్ళువిఱిగెను. కొందఱకుఁజేతులువిఱిగెను కొందఱకుఁ బండ్లురాలిపోయెను. కొందఱకు ముక్కుచెక్కలయ్యెను. అందఱును వికలాంగులయిరి:—

రావణుఁడుమెచ్చి హనుమంతునితో:—

శా॥ ఆహా! బాహుబలంబులాఘవమదే♦యాశ్చర్యమాశ్చర్యమా
ఆహా! నాకిఁకనుద్దిలేరిచట నా ♦ కానందముౝబెంచితో
నూహాౝ వేఁడుమదేమికావలయునో♦యుత్సాహముప్పొంగఁగా
బాహాటంబుగనిత్తుఁజూడుమిదెమ♦త్ప్రాసాదసౌధాదులౝ.

హనుమంతుఁడు:—

క॥ లంకాద్వీపంబంతయు

రావణునిగుండె జల్లుమనును:—

హనుమంతుఁడు మరల:—

క॥ లంకాధ్వంసంబంతయు
శంకాతంకములులేక ◆ చనిపోడంగన్
సంకేతపత్రమొసఁగుము
ఇంకేమియుఁగోర రాక్ష ◆ సేశ్వర! నిన్నున్.

రావణుఁడు మంత్రియగు ప్రహస్తునిఁజూచి తక్షణమే యిమ్మని యాజ్ఞాపించును:—

( అశోక వనము. )

హనుమంతుఁడు ఆకసమువంకఁజూచి:—

గీ॥ వెండిపంజరమునహంస ◆ వెలయునట్లు
మందరంపుగుహాసింహంబు ◆ మసలుకరణి
మదగజముమీఁద పేరుఁడు ◆ పొదలుతీరు
మింటనెంతయుఁజంద్రుండు ◆ మెఱయఁదొడఁగె.

గీ॥ దాసదాసీజనంబులు ◆ దన్నుఁగొలువ
రావణుండును సీదారి ◆ రాఁదొడంగె
వీనులకు రామశబ్దంబు ◆ వినఁగవచ్చె
నుండితీరును సీతయూ ◆ యువవనమున.

( అశోకవనమున వృక్షముక్రింద )

సీతకూర్చొనియుండఁగా వెనుక హనుమంతుఁడొదిగియుండును
రావణుఁడువచ్చి సీతనుజూచి:—

శంకరాభరణము — రూపకము.

ఇంకైనదయరాదా - ఇంతి!నామీఁద - ఇంకైనదయరాదా
పంకజలోచన! - సంకటపెట్టకు - లంకారాజ్యమునీకే - కింకరుఁడనునేను. ॥ ఇం ॥

సీత:—

మ॥ తులువా!నోటికివచ్చినట్టులిటులెంతో ప్రేలెదవుఁగాక నీ
తల రాముం డెగఁజిమ్ము నీమదముదగ్ధంబౌను బో పొమ్ము నీ
వలరామాధిపుకంటె శూరుఁడయినన్ హా దుష్ట! నీవిట్లు దొం
గిలి నన్ దెచ్చెదవే కిరాతక! మహాక్లేశంబు నేనొందఁగాన్.

రావణుఁడు:—

గీ॥ చచ్చెరనుబోయి నీపతి ♦ శిరముఁదెచ్చి
ముందుఁ బడవైతు నప్పుడేని ♦ సుందరాంగి!
శూరుఁడెవ్వఁడొ లోకనులారఁ ♦ జూడఁగలవు
రావణుండన్న ధరలోనఁ ♦ గేవలుండె? అని వెడలి
పోవును.

సీత:— క॥ రామా! సుజనారామా!
రామా! నా ప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! రఘునాథనామ! రామా! రామా!

హనుమంతుఁడు:—

క॥ శ్రీరాము బంటుబంటను
నీరాకరమీఁది లంక ♦ నిన్నిటుగంటిన్
ఆరేనిఁయుంగ్రమిదిగో
వేఱొకటేదైనగురుతు ♦ వేఁడెదఁదల్లీ!.

సీత:—

సీ॥ అనిలోనరిపుఁజంపి ♦ ననుఁగాచుననియెడి
మదిలోనిదూరాశచే ♦ మంటిననుము
ఆలక్ష్మణునినొవ్వ ♦ నాడినందులకయి
వెంటనేతగుశిక్షఁ ♦ గంటిననుము
ఆనాథునుగుణాళి ♦ నాత్మలోఁదలఁచుచు
నుచితవర్తనమున ♦ నుంటిననుము
మానసమ్ములోవచ్చి ♦ మఱిఁగావకుండిన
నసువులఁదొరఁగెద ♦ నంటిననుము

గీ॥ సర్వమునెఱింగినట్టియా ♦ స్వామికేను
నింతకంటెనుజెప్పంగ ♦ నెఱుఁగననుము
పరమపూజితుఁడైనయా ♦ ప్రాణవిభుని
చరణపద్మమ్ములకు నమ ♦ స్కారమనుము
గురుతుగా నాశిరోమణిఁ ♦ గొనుము చనుము.

( లంక విద్యుద్యంత్రశాల )

హనుమంతుఁడు సంకేతపత్రమునుజూపి లోనికివెళ్లి యంత్రము
ను బగులఁగొట్టును:—  ( లంక తగులబడును. )

రావణుఁడు:—

సీ॥ గుడులుమేడలు గోపురాల్ ♦ కూలెనవిగో
అంతటను భగ్గుమనిమంట ♦ లలమెనవిగో
మెఱపుమఱుప్రబ్బెలంకను ♦ జెఱచియిటు
నష్టమొనరించినట్టియా ♦ దుష్టుఁడెవఁడు
నాయెదుటఁ డెందుకనిదీఱ ♦ నఱకవైతు
నవిభయంకరాసిరసిం ♦ హమ్ములార!.

హనుమంతుఁడు:—

సీ॥ నేనెనే జెఱచితిఁ ♦ జెఱచితినేనెనుమ్ము
చేతనైనబట్టుకోఁగల ♦ వీరుఁడెవఁడు
రామభటుఁడను హనుమంత ♦ నామకుఁడను
మల్లుఁడను పేరువచ్చినా ♦ మహిమఁజూపి
మరలుచున్నాఁడ రాముని ♦ శరణుఁజొచ్చి
బ్రదుకు రావణ! చెడకు నా ♦ పలుకువినుము
క్షిప్రకోదండ రాఘుని ♦ నిశితశరము
నీశిరముఁద్రుంచు ననిలోన ♦ నిక్కువమ్ము.

అని రావణునిపన్ని సముద్రములోఁబడి యీఁదుకొని వెళ్లిపోవును

( మహేంద్రపర్వతప్రాంతము. )

హనుమంతుఁడు వానరులతో:—

సీ॥ కన్నీరు కాల్వలై ♦ కారు కన్నులతోడఁ
జెక్కిటఁ జేర్చిన ♦ చేయితోడ
తెల తెలఁబారిన ♦ దీనాననముతోడ
జడలుగట్టిన శిరో ♦ జములతోడ
వేఁడినిట్టూర్పుల ♦ వాడునాసికతోడఁ
గడుఁజిక్కి స్రుక్కిన ♦ యొడలితోడ
అట్టిచినింగిన ♦ కట్టువస్త్రముతోడ
నోట రామా! యనుమాటతోడ

గీ॥ శోకమునమున్గిదేవి య ♦ శోకవనము
నందున్నది లంకలో ♦ నందమొదలి
నేమమును దెల్పి యుంగరము ♦ చేతికియ్య
జనని! తలమానికము నిచ్చెఁ ♦ గొనుము రామ!.

లంక నెట్లున్నదని శ్రీరాముఁడడుగఁగా హనుమంతుఁడు:—

సీ॥ ఇరువంక నొకతీరు ♦ వరసౌధములమీఱు
విస్తారవీథికా ♦ నిస్తులంబు
వివిధపుష్పోద్యాన ♦ వేణువీణాగాన
విద్యుత్ప్రదీపికా ♦ విలసితంబు
చతురంగసైనిక ♦ సంచారభూమిక
మల్లకేళీరంగ ♦ మండితంబు
బహుళయంత్రోపేత ♦ ప్రాకారపరివృత
పటుదుర్గశోభిత ♦ పార్థివంబు

సీ॥ మాంసభోజన పరసతీ ♦ మానహరణ
మద్యపానాది పాప స ♦ మన్వితంబు
రాక్షసేశ్వరదోర్దండ ♦ రక్షితంబు
పాపులకుఁగాపురంబు లం ♦ కాపురంబు.

( సముద్రప్రాంతము. )

రాముని శిబిరము.

విభీషణుఁడు:—

కమాచ్ — రూపకము.

శరణు శరణు రఘురామా! సద్గుణధామా! శరణు దశరథరామా!
శరణాగతత్రాణబిరుదు - నీదనివిని - శరణముచేఁజొచ్చితి
[illegible] - చరణములనే శరణువేఁడితి. ॥శర॥

సుగ్రీవుఁడు శ్రీరామునితో:—

చ॥ ఇతఁడు విభీషణుండు దశ ♦ కంఠుని తమ్ముఁడు నమ్మ పాపుల
హితునికి నిచ్చిరే మనకు ♦ నెవ్వగనొవ్వగ నానుగానసా
మరియును సీతనీయకు ♦ మాన్యునిఁజేయుట మేలుగాదు
హితమతి నెంచిచూడుఁడు ♦ …ంద్రుని మాయలమేయముల్ ప్రభూ

శ్రీరాముఁడు:—

ఉ॥ [illegible] రావణుఁడు ♦ దాశరథిం బనివచ్చి వేఁడినన్
[illegible] ♦ నేకము కాంచ విభీషణుఁ బావఁడిన్

దెమ్మొకరమ్మొ గౌరవము ♦ తేటపడంగనుఁగొమ్మొ పొమ్మొనా
తమ్మునిఁబోలెఁ జూచెద ను ♦ దారతఁబర్వతిలోకనాయకా!

విభీషణుఁడు:—

కమాచ్ — రూపకము.

శరణుదశరథరామ! సద్గుణధామ! శరణుదశరథరామ!
పరసతిఁగోరుట - పాపమంచని తెల్పఁ - బురము వెడలనడచెను
దురితపరుఁడౌ రావణాసురుఁ - డరయు నే భవదీయ శౌర్యము ॥ శర ॥

అని శ్రీరాముని చరణములమీఁదఁ బడును:—

శ్రీరాముఁడు:—

ఉ॥ లెమ్ము విభీషణా! భయము ♦ లేదిఁక నీకభయమ్మొసంగితిన్
జిమ్మెద వైరిగుండెల ♦ భిషిక్తునిఁ జేసెద నిన్ను లంకకున్
సమ్మము రావణాసురుఁడు ♦ నాశరణంబొకవేళఁ జొచ్చినన్
సమ్మతి నిన్నయోధ్యకు ని ♦ జంబుగఁ బట్టముఁగట్టి కాచెదన్.

( లంక. రావణుని యంతఃపురము. )

మండోదరి రావణునితో:—

కమాచ్ — రూపకము.

పరనారీ!సంపర్కము - పరమదురితము - పరనారీసంపర్కము
దరిలేనిదుఃఖము - దొరకొనఁజేయును ॥ పర ॥
సిరులఁదొలంచును - జిరకీర్తి మాపును - పరమశూరునికైనఁ
బరిభవ మొనరించు ॥ పర ॥

బాణములనుబడి - స్వామి! నిన్నేడెదఁ
పద్మాక్షిసీతను - దాశరథికినిమ్ము ॥ పర ॥

రావణుఁడు:—

క॥ దశజనబాహుబలమ్మును
దశజనధీబలముగలిగి ♦ దశకంఠుఁడనన్
దశదిశలఁబేరుపొందితి
శశిముఖ! వెఱపేలనాకు ♦ శత్రుండెదుటే

అని మేడపైకిఁదీసికొనిపోయి:—

సీ॥ సౌధాగ్రమ్మునుండిచూడుముసతీ! ♦ సంగ్రామరంగంబున
మోహాగ్రేసరులెల్లఁగూడిరదిగో ♦ యుత్సాహముప్పొంగఁగా
క్రోధోద్దీపితమానసంబులభటుల్ ♦ ఘోషిల్లుచున్నారదే
మాధాంపవానాయియుద్ధమునకై ♦ యూకొల్పెఁదూర్యధ్వనిన్

తే. హాసతి! బాణవేగమదె ♦ యక్కట! యొర్వకనాదుసైనికుల్
రాసులురాసులై పుడమి ♦ రాలఁగఁజొచ్చిరేమిచోద్యము

మేఘనాదునిఁజూచి:—

ఓసుత! మేఘనాద! కడు ♦ యుక్తులనేర్చినసీకెచెల్లుఁగా
నాపగరామునింపుచిమి ♦ నారకసీతనునాకుఁగూర్పఁగాన్.

మేఘనాదుఁడు:—

కమాచ్ — రూపకము

పరనారీసంపర్కము - పరమపతితము - పరనారీసంపర్కము.

రావణుఁడు:—

క॥ కదనముఁజూచి భయంపడి
యిదియొకనెపమెన్ని పలుకు ♦ దేనీచాత్మా!
యెదురాడకు నాముందట
వదరినసీశిరముఁద్రుంచి ♦ వైచెదనిదిగో.

( రణరంగము. )

విభీషణుఁడు లక్ష్మణునితో:—

చ॥ అదెయదెవచ్చెరావణుని ♦ యగ్రకుమారుఁడుచూడుచూ
డుమా
పదపదలక్ష్మణా!కదిసి ♦ ఫాలమునంటఁగబాణమేయుమా
అదెవడివాడిబాణమదె ♦ యక్కటవచ్చెనుగొట్టుకొట్టుమా
యిదెపడెలక్ష్మణుండహహా♦ యేమిఘటిల్లఁగనున్నదోకటా!

( శ్రీరాముఁడు పడిన లక్ష్మణునిఁ జూచి:— )

నాథనామక్రియ — రూపకము.

అకటా!లక్ష్మణ!పడితే-ఆలములోపల నీవు
ఇఁకయుద్ధము నాకేలను-ఇంతటితోఁజాలింతును ॥ అకటా
అడవులలోనాతోఁబడి-ఇడుములకన్నిటికోర్చి
విడనాడక మెలఁగితివే - పుడమిని నీకీడుగలఁడే ॥ అకట

జాంబవంతుఁడు:—

గీ॥ నాడియాడుచున్నది ♦ వేఁడికలదు
భయపడకురామ! మూర్ఛిల్లె ♦ భయముపడకు
దూరమునఁగాంచవచ్చెడి ♦ ద్రోణగిరిని
వెలయుసంజీవిఁగొనిరాఁగ ♦ వేగనరిగె
వాయుపుత్రుండుస్వామి సే ♦ వాపరుండు॥

( శ్రీరాముఁడు లక్ష్మణునిఁజూచి కంటఁదడిపెట్టుకొని )

క॥ జననీజనకులకంటెను
దనకులసతికంటెఁబ్రాణ ♦ ధనములకంటెన్
ఘనముగ నన్గనుతమ్ముఁడు
రణమునఁబడెరమణియేల ♦ రాజ్యమదేలా?

జాంబవంతుఁడు:—

ఆ॥ ఆంజనేయుఁడదిగో ♦ సంజీవిఁగొనివచ్చె
దేవ! చూడు దీని ♦ దివ్యమహిమ
మెల్లమెల్లగాను ♦ మేల్కొనిసౌమిత్రి
రమ్యసుగుణసాంద్ర ! రాఘవేంద్ర !

( శ్రీరాముఁడుఆంజనేయునితో )

గీ॥ చెలిమి సుగ్రీవుతోనాకుఁ ♦ గొలిపినావు
దేవిఁగనివచ్చి నాకోర్కెఁ ♦ దీర్చినావు

తెచ్చిసంజీవినాతమ్మున * నిచ్చినావు
జౌన నీసేవనుతిసేయ * నాంజనేయ !

( అందరును సంతోషముతో )

శంకరాభరణము—రూపకము

రామ ! రాజభూషణా ! రాక్షసకులభీషణా !
సామమధురభాషణ ! సాధుతాపశోషణా !

మేఘనాదుఁడు:—

చ॥ ఇదెయిదె సీతదౌశిరము నేఁ * దెగఁద్రుంచితిఁ జూడుఁడీ ముదం
బొదవఁగ నాదుతండ్రికిని * యుద్ధములోపల మీశిరంబులన్
జెదరఁగఁ జేసెదన్ వినుఁడు * చేతను బాణములుంచిరండు న
న్నెదిరిసురేంద్రుఁ డేమియ యె * నేర్పడఁ జూడుఁడు మత్ప్రతాపమున్

( సీతశిరముఁ జూచి శరమును జార్చుచున్న లక్ష్మణునితో విభీష
ణుఁడు )

చ॥ అదెయదె మాయఁ జేసెనది * యాజనకాత్మజమస్తకంబుగా
నది యొకవాఁడిబాణమున * నా చెడురక్కసుఁ ద్రుంచు లక్ష్మణా!
(రాఁ) అదె బలుఁ గొట్టితే నసుర * నాదట వ్రక్కలుచీలునట్లుగా
నెదమరిభేదిలన్ శిరము * దేఁగి తటుక్కున భూమి వ్రాల్లఁగాన్.

( అందరు మేఘనాదుఁడు పడుటకు సంతోషించి )

శంకరాభరణము—రూపకము

రామ! రాజభూషణ! రాక్షసకులభీషణా!
సామమధురభాషణా! సాధుతాపశోషణా॥ ॥రామ॥

( కుంభకర్ణుని భవనము )

( తాగుచుండెడు కుంభకర్ణుని సమీపించి, రావణుడు. )

ఉ॥ తమ్ముడ! కుంభకర్ణ! నినుఁ ♦ దప్పమ రెవ్వరు లేరు నాకు నీ
వెమ్మెయిఁబోయి దాశరథి ♦ నెట్లయినన్ వధియించి రాగదే
నమ్మిన నాకు సమ్మదమొ ♦ నర్వము పొమ్ము జయమ్ము
[గొమ్మనా
తమ్ముఁడవైన నీకతనఁ ♦ దప్పక సీతను బొంది పొంగెదన్.

కుంభకర్ణుడు:—

కమాచ్—రూపకము

పరనారీసంపర్కము-పరమదురితము-పరనారీసంపర్కము

( అని ప్రారంభింపఁగా వానికి ద్రాగుడునిచ్చి రణమునకుఁ బం
పి రావణుఁడు వెళ్ళిపోవును )

( రావణుఁడు సీతనుసమీపించి )

క॥ రాముతలఁజూడు సీతా!
యేమంటివి నాఁడు నన్ను ♦ నెవ్వఁడు కోరుం
డీమారు మారుపలుకకు
కామితమును దీర్పవలయుఁ ♦ గాంతామణిరో!

క॥ రామా! సుజనారామా!
రామా! నాప్రాణధామ! రవికులసోమా!
రామా! రాజలలామా!
రామా! సుగుణాభిరామ! రామా! రామా!

(రణరంగము.)

విభీషణుఁడు శ్రీరామునిఁజూచి:—

ఉ॥ వచ్చెనుగుంభకర్ణుఁడదె ♦ వాకరవంశపయోధిచంద్రమా!
చెచ్చెరనొక్క బాణమునఁ ♦ జిమ్ముము వీనిశిరమ్ము డొల్లఁగా
(రాఁ)అచ్చెరువయ్యెనో రఘువ ♦ రా! యదె వైరిశిరమ్ము మీఁదికిన్
హెచ్చుగఁబోయెదిద్దిరిగి ♦ యచ్చటనే పడిపోయెఁజూచితే.

అందఱు:—

రామ! రాజభూషణ! - రాక్షసకులభీషణ! - సామమధురభాషణ! - సాధుతాపశోషణా!

(రావణుని యంతఃపురము.)

మండోదరి రావణునితో:—

ఉ॥ పావనమౌపులస్త్యముని ♦ వంశమునన్ జన్మియించినారు సం
భావితశౌర్యధైర్యమహి ♦ మన్ బలువాసినిగాంచినారు నా
నావిధవిద్యలన్ దెలిసి ♦ నారు పరాంగనఁగోరిమానమున్
జీవముఁగోలుపోఁదగునె ♦ సీతను రాముని కీక నాయకా!

రావణుఁడు:—

ఉ॥ కామినీ! యందఱన్ మడియఁ ♦ గాంచితి నీతు లవేల నాకునో
తామరసాక్షి! కుందకుము ♦ దాశరథిన్ మఱి వానివారలన్
నామిడివోని బాణముల ♦ నాపరువొప్పఁగఁ ద్రుంచి వైచెదన్
గోమల సీతతోఁ గలిసి ♦ కూరిమితోడుత లంక నేలెదన్.

( రణరంగము. )

విభీషణుఁడు శ్రీరామునితో:—

ఉ॥ వచ్చెను రావణాసురుఁడు ♦ వానిని ద్రుంచుట సాధ్యమో ప్రభూ!
చిచ్చుగవంటు వందజను ♦ జెచ్చెరఁ జంపక జాగు చేసినన్
(రా.) హెచ్చు త్వదీయ శౌర్యమున ♦ కెవ్వరు సాటి జగంబు నందహో
అచ్చెరువయ్యె వైరివగు ♦ నశ్వరథంబులు గూలె నొక్కటన్

చ॥ సరసరకత్తి దూసి మన సైనికులన్ ♦ దెగటార్చ సాగెనో
సరసిజమిత్రవంశమణి! ♦ చాపము నెక్కిడు నీచు శత్రుడా
శిరముకెలుకున్నన్ దఱుగు ♦ సేమముగా దెడసేయనో ప్రభూ!
(రాం.) తిరమొనుతింప వైరియుడి ♦ దంబ దెసగ్గయి రాలెనేలపై.

శ్రీరాముఁడు రావణుని సమీపించి:—

ఉ॥ లేదు శరంబు లేదు విలు ♦ లేదడిదంబును సేరు సైనికుల్
మీఁదని కేమి నీకు గతి ♦ మేలగు నా సతి సీత నిమ్ము ని
న్నాదర దృష్టిఁ జూచెద భ ♦ యంపడఁ బోకుము పొమ్ము రావణా!
నాదగు పల్కు మీఱితివను ♦ నాశము చేసెద జేపెమాడుమా

( రావణుని యంతఃపురము. )

మండోదరి రావణునితో:—

హరికాంభోజి — రూపకము.

కరుణానిధియౌదాశరథి - కల్యాణగుణనీరధి
కరుణానిధి యౌదాశరథి
తరుణిసీతనిచ్చి - చరణములబడి
శరణము వేడిన - సరగునఁబ్రోచును. ॥ కరుణా ॥

రావణుఁడు:—

క॥ చొచ్చెదనే శరణంబును
జచ్చెదఁగాకొండె వైరిఁ ♦ జంపెదనొండేన్
ముచ్చటదీరక జానకి
నిచ్చెదనే ప్రాణమైన ♦ నిచ్చెదఁదరుణీ!

ఉ॥ ఈపరిరామునింబొగిడి ♦ యెత్తెదనాదుశరాగ్నికీలలం
దోపికవాణి! యాహుతిగ ♦ నొక్కటఁ బ్రేల్చిమదీయశౌర్యమున్
జూపెదఁజాటియెల్లరకు ♦ సుందరిసీతను గూడిపొంగెదన్
నాపరివారమున్ బ్రజలు ♦ నాప్రియురాలగునీవుసుబ్బఁగాన్.

( రణరంగము. )

విభీషణుఁడు శ్రీరామునితో:—

చ॥ అదెవచ్చెవచ్చె రావణుఁడ ♦ హంకృతిఁదీక్ష్ణ శరాళిసేనలన్
జెదరఁగఁజేసె వైరితలఁ ♦ జిమ్ముముచూచెదవేమి? రాఘవా!

(తా॥)అదెదిరదిద్దిరందిరిగి ◆ యంబరవీథిని బోయిపోయి య
ల్లదిగో తటాలునఁ బడెను ◆ నారిపుమస్తకముర్విపైఁ బ్రభూ!

అందఱు:—

రామ! రాజభూషణ! రాక్షసకులభీషణ! సామమధురభాషణ!
సాధుతాపశోషణా!

మండోదరి:—

నాథనామక్రియ — రూపకము.

హా విభు! నను బాసితే - అకట! చింతఁద్రోసితే
భూవిభు శ్రీరామచంద్రు - దేవినిచ్చి శరణువేడి - చావకజీవింపుమన్న
చలముపట్టి గిట్టితే ॥ హావి ॥
పరులస్త్రీలఁగోరువారి - పాటిదేయంచుఁజాటి - దురితపరా!
ప్రాణనాథ! దూరమయిపోయితే ॥ హావి ॥

శ్రీరాముఁడు విభీషణునితో:—

గీ॥ అలుకమాని విభీషణా! ◆ యగ్రజునకు
నుత్తరక్రియ లొనరించి ◆ యుచితరీతి
నూరడింపుము దుఃఖించు ◆ చుండు నీదు
వదినెగారిని సాధ్వియై ◆ పరఁగుదాని.

ఋషులు శ్రీరాముని సమీపించి:—

గీ॥ కంటకుండగు నాదశ ◆ కంఠుఁ దునిమి
భద్రమును గూర్చితివి మాకుఁ ◆ బార్థివేంద్ర!

పొగడఁదరమానె నిన్ను నో ◆ సుగుణసాంద్ర!
రమ్యరవికులకలశవా ◆ రాశిచంద్ర!

శ్రీరాముఁడు:—

గీ॥ చెలఁగుమీవగు దీవెన ◆ బలిమిఁగాక
నాబలముచేత వైరిని ◆ నాశపఱుపఁ
జాలుదునె నన్ను నగ్గింప ◆ నేలమీకుఁ
బుణ్యధనులార! మౌనివ ◆ రేణ్యులార!

శ్రీరాముఁడు విభీషణునితోఁ:—

శా॥ లంకాద్వీపము నేలుమింకఁ గరుణా ◆ లంకారా! శాంతాత్మ! ని
శ్శంకన్నీవు విభీషణా! నిను జనుల్ ◆ శ్లాఘింపఁగా నేర్పుతోఁ
గైంకర్యమ్ము వలేరు చేసముబునన్ ◆ గంటిన్ దగన్ దప్పచే
వంకన్ గావెడువట్లు గాచితి కదే ◆ వారించితి కష్టంబులన్.

( శ్రీరాముని శిబిరము. )

శ్రీరామచంద్రుఁడు వృక్షముక్రిందఁ గూర్చుండియుండఁగా నందఱును జయోత్సవమునుజేయుచుండిరి. ఋషులు సామములు గానర్చుచుండిరి. ప్రజలుత్సవముఁ జేయుచుండిరి. బాలురు పలుతెఱంగుల బాణములఁ గాల్చుచుండిరి. విభీషణుఁడు సీతాదేవిని పైడియందలములోఁ దెచ్చి నిలిపెను. సీతకును శ్రీరామునికిని సమ వియుక్తి సంబంధమైన వేడుకలన్నియు జరుగుచుండెను

ఎంతో కాలముమీఁదఁదనప్రాణనాథుఁడగు శ్రీరామచంద్రునిఁ జూచినయాసీతామహాదేవికినీవేడుకలొక్కటియుఁ గావరాలేదు. ఆమెలత్స్యమంతయు శ్రీరామునియందేలగ్నమైయుండెను. కాన నాయగ్నిలోనుండి మెఱపువలెవచ్చి శ్రీరామచంద్రుని పాదారవిందముల కెరగెను.

ఈదృశ్యముచు జూచుచున్నవారందఱు:—

గీ॥ అగ్ని తెఱదాఁటి యోజన ♦ కాత్మజాత
పరమపూతపతివ్రత ♦ పాపరహిత
మెఱపువలెవచ్చిరాముని ♦ కెరగెనదిగో
యహాహా! యెంతటిగరితయీ ♦ యమలచరిత.

అనికొనియాడుచుండిరి:—

సీత:— హంసధ్వని — రూపకము.

కంటిమీపదకంజముల నుదు - రంట మ్రొక్కితిని
కంటకునిదశకంఠుఁదునిమినా
తొంటిపుణ్యములనెల్లఁ - బంటపండఁజేసితిరి. ॥ కంటి ॥

శ్రీరాముఁడు:—

లెమ్ముసీత! కరమ్మునంతో - షమ్ముఁబొందితిని
రమ్మునీదుకరమ్ముఁదెమ్మిట
నుమ్మలికమెల్లఁ బేరె - నెమ్మదిగనుండుమింక. ॥ లెమ్ము ॥

సీత:— ఈత్రిజటనామిత్రమో ప్రభు! శత్రులిందఱిలో
చిత్రవధ రిపు చేసియుండఁడె
చిత్రమీపవిత్రచరిత-చెంతమాత్ర లేకయున్న. ॥ ఈత్రి॥

శ్రీరాముఁడు:—
సీత! వీరిస - మేతముగ సాకేతపురి కేగి
ప్రీతిరత్నహారితములనొగి
చేతులారనిమ్మనీకుఁ - జేతికడ్డమేది లేదు ॥సీత॥

( అయోధ్య. )

ముందేపంపఁబడిన యాంజనేయుఁడు భరతునితో:—

శంకరాభరణము — రూపకము.

అదిగో శ్రీరామచంద్రుఁ - డరుదెంచెనుజూడు భరత!
కదలివచ్చుసూర్యుపగిదిఁ - గానఁబడెవిమానమదిగో ॥ అది ॥
దనుజపతియు వనచరపతి - తనతమ్ముఁడు భక్తిఁగొలువ
జనకరాజతనయఁగూడి - చనుదెంచెను రామవిభుఁడు ॥ అది ॥
ధరకుదిగెవిమానమదిగో - తరలివచ్చెరాముఁడదిగో
భరతా! వేవేగరమ్మ - భారిత్రివరుని సేవింపుము. ॥ అది ॥

భరతుఁడు:—
గీ॥ చెచ్చెరనురామ! పట్టాభి ♦ షిక్తుఁడవయి
శిరముపైనున్న యోర్వని ♦ బరువుడించి
నన్ను! ధన్యునిగాఁజేయు ♦ మన్న! నేఁడె
యెల్లజనములయుల్లముల్ ♦ పల్లవింప.

శ్రీరామచంద్రుఁడు తల్లులకెల్లరకును మ్రొక్కి విన్ననైనమొగమ్ముతోఁ గన్నీరుగార్చుచు నొకమూలయందొదిగియున్న కైకను సమీపించి యత్యంతవినయముతో:—

గీ॥ తండ్రికుండెడు ప్రేమను ♦ దమ్ములకును
నుండుప్రేమను మిత్రుల ♦ కుండుప్రేమ
భార్యకుండెడుప్రేమ సే ♦ వకులప్రేమ
యిన్నిప్రేమల నీకృప ♦ నెఱుఁగఁగంటిఁ
జింతిలకుమమ్మ దీవించి ♦ చెలఁగుమమ్మ!

అని నమస్కరించెను:—

( అయోధ్య సభాభవనము. )

( శ్రీరామ పట్టాభిషేకము. )

సీ॥ శత్రుఘ్నలక్ష్మణుల్ ♦ సరినిరువంకల
వింజామరమ్ముల ♦ విసరుచుండ
వెనుకనునిలఁబడి ♦ విమలాతపత్రంబు
భరతుండు చేడ్కతోఁ ♦ బట్టుచుండఁ
బదములకడఁజేరి ♦ పవనతనూజుండు
గురుతరభక్తితోఁ ♦ గొలుచుచుండ
దనుజులు వనచరుల్ ♦ దమతమపతులతోఁ
గుసుమవర్షమ్ములు ♦ గురియుచుండ
గీ॥ మునులయాశీరవమ్ములు ♦ పొదలుచుండఁ
బ్రజలజయజయనాదముల్ ♦ పర్వుచుండ

భూరిమంగళవాద్యముల్ ♦ మ్రోయుచుండ
భవ్యచిత్రమహాసభా ♦ భవనమందు
రత్నసింహాసనంబున ♦ రమణిఁగూడి
మస్తకంబునమణిమయ ♦ మకుటమొప్పఁ
జెలువమీరంగఁ బట్టాభి ♦ షిక్తుఁడయ్యె
సర్వనుతకీర్తి శ్రీరామ ♦ చంద్రమూర్తి.

గీ॥ సవితృవంశాబ్ధిసంపూర్ణ ♦ చంద్రుఁడైన
రామచంద్రుండురాజ్యభా ♦ రమువహింప
సృష్టియంతయుఁబుష్టియుం ♦ దుష్టిఁబొండె
శిష్టులందఱుపరమప్ర ♦ హృష్టులైరి.

సీ॥ సుగ్రీవుపేరిట ♦ సురుచిరమయినట్టి
విశ్వకళాశాల ♦ వెలయఁజేసె
నావిభీషణుపేర ♦ నతివిచిత్రవిశాల
విమలసరోవరం ♦ బమరఁజేసె
జాంబవంతునిపేర ♦ జనవిహారోచిత
ప్రమదావనంబును ♦ బరఁగఁజేసె
తననికేతనముపైఁ ♦ దనరుకేతనముపై
నాంజనేయాకృతి ♦ నిలుపఁజేసె

గీ॥ దీనశరణాలయంబును ♦ త్రిజటపేరఁ
గ్రాలఁగాఁజేసియవల ♦ గాసిఁదీర్పఁ
గోరుకోరికెలన్నియుఁ ♦ గూర్మినొసఁగి